శ్రీ రాజగోపాల పరబ్రహ్మణేనమః

# రాజగోపాల హరిశతకము.



కం॥ శ్రీవత్సలాంఛనాచ్యుత ♦
దేవా ♦ వసుదేవతనయ ♦ దివిజార్చిత ♦ భ
క్తావన మందార ♦ హరీ ♦
గోవింద ♦ మురారి ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 1

గోపాలకృష్ణ ♦ దయతో
మాపాపములెల్లఁ బాపిమరుజనక ♦ నన్నుఁ
గాంపాడిపోవఁ గాఁ దగు
గోపీజనలోల ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 2

సురనుత ♦ దైత్యకులాంతక ♦
సరసిజభవ వినుతచరణ ♦ శరనిధిశయనా ♦
స్మరజనక ♦ శ్రీరమావర ♦
గురుమందర ధార ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 3

హరి ♦ గోవింద ♦ మురాంతక ♦
సరసీరుహనయన ♦ కలుషసంహార ♦ కృష్ణా ♦
మరిమరి నీపాదంబులు
గురిజేసి భజింతు, రాజ గోపాల ♦ హరీ ♦ 4

గోవింద ♦ నీదునామము
భావంబున నిల్పినిన్నుఁ బ్రార్థించితి నా
భావమున నిలచిపోవుము
గోవర్ధన ధార ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 5

పలుమారు నిన్నువేడితి
జలరుహ దళనయన ♦ నీదుచరణ యుగంబుల్
అలరుచుఁ జూపవె రాక్షస

కమలాప్తతేజ ♦ మీపద
కమలము లెదనమ్మియుంటి కరుణించవయో
హిమగిరి జానుతనామా ♦
కుమతిజనవిదూర ♦ రాజగోపాల ♦ హరీ ♦ 7

హరి ♦ నిన్ను నమ్మికొలిచిన
వరభక్తుల కొసఁగినట్టి వరములునాకున్
అరమరసేయక నొసఁగవె
గురుదైవమ నీవెరాజ గోపాల ♦ హరీ ♦ 8

నీదయఁ జూపెదవని స
మ్మోదంబున వేచుచుంటి మురహరనాపై
వాదము వలదిక మొక్కెద
కోదగు మురవైరిరాజ గోపాల ♦ హరీ ♦ 9

అనుదినము నీదునామము
మనమున భజియించిభక్తి మరువనెప్పుడున్
వనమాలి ♦ కృష్ణ ♦ యని నీ
కును మొక్కెదఁ బ్రోవురాజ గోపాల ♦ హరీ ♦ 10

మీకంటె వేల్పులెవ్వరు
లోకంబులు ప్రోవనింక లోకేశ ♦ హరీ ♦
నాకోర్కెలిచ్చి కావవె
గోకులసంచార ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 11

కాంచనచేల ♦ దయానిధి
నంచున్ శరణంటిఁ బ్రోవుమచ్యుత ♦ నీకున్
వాంఛయు గలుగదె నాపైఁ
గొంచెము మురవైరి ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 12

శ్రీపతివి దయాకర ♦ నా
పాపదళనుబ్రోవఁ జిన్మయము సంహారా ♦

చేపట్టి ప్రోవవేహరి
గోపీజనలోల ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 13

నరసింహా ♦ కృష్ణ ♦ కేశవ ♦
పరమాత్మ ♦ ముకుంద ♦ శౌరి ♦ పాపధ్వంసా ♦
పురరిపు వినుత ♦ జనార్దన ♦
గురుతర దయఁబ్రోవు రాజ గోపాల ♦ హరీ ♦ 14

యదువంశ వార్ధిచంద్రమ ♦
మదినమ్మితి నీపదముల మందరధర ♦ నా
హృదయంబున నిల్వవె నా
కొదువలు తీరంగ రాజ గోపాల ♦ హరీ 15

శ్రీ వైకుంఠ పురీశ్వర ♦
దేవ ♦ నిఖిల మౌనులష్ట దిక్పాలకులున్
సేవించిన వరమొసఁగవె
గోవింద ♦ మురారి ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 16

అరవిందనయన ♦ భవహర ♦
కరుణాకర ♦ భక్తపాల ♦ కరిరక్షక ♦ నా
మొరవినుటకు నీచెవికిన్
గోరగాదది యేలరాజ గోపాల ♦ హరీ ♦ 17

నీకరుణ చూపకుండిన
నాకాధిప వినుత ♦ నిన్ను నగరే లోకుల్
ప్రాకటముగ దయఁ జూపవె
గోకులసంచార ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 18

నీమహిమ లెన్నఁ దరమే ?
తామరస ప్రభవచంద్ర ధరులకునైనన్
నేమరక నన్నుఁ బ్రోవుము
కోమలరవి తేజ ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 19

నీదాపుఁ జేరివేడితి
రాదానా తొడలఁ గరుణ రాధాలోలా ♦
వాదానాతోడనుఁ గై
కోఁ దగు నామనవిరాజ గోపాల ♦ హరీ ♦ 20

నీపాద భజనఁ జేసెద
శ్రీపాలక ♦ జలజనయన ♦ శ్రితజనపాలా ♦
నాపాల నిలచిప్రోవుము
గోపీజనలోల ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 21

శరణాగతవత్సల ♦ యో
పరమాత్మ ♦ దయాపయోధి ♦ పద్మదళాక్షా ♦
కరుణించి ప్రోవగదె నా
గురుదైవము నీవెరాజ గోపాల ♦ హరీ ♦ 22

ఇందురవి నేత్ర ♦ పూర్ణా
నంద ♦ దయాశరధి ♦ రావెననుఁ బ్రోవఁగ గో
విందా ♦ యని వేడితిగద ♦
కుందయ శస్సాంద్ర ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 23

నామొరలాలించుము సు
త్రామాది సమస్తనిర్జరార్చిత చరణా ♦
దామోదర ♦ పరమేశ్వర ♦
కోమల రవితేజ ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 24

అనిశము రుక్మిణిసత్యయు
వినులక్షణ భద్రమిత్ర విందాములు నీ
యెనమఁడ్రిల్లాండ్రును మూ
కొనికొల్తురు కాదెరాజ గోపాల ♦ హరీ ♦ 25

నీవేనా కులదైవము
నీవేనా గురుఁడవనుచు నినువేడఁగా

రావేనను బ్రోవఁగఁ గై
కోవే నా మనవి రాజ గోపాల ♦ హరీ ♦ 26

ఒకసారి నీదునామము
ప్రకటముగఁ బఠింపఁబాయుఁ బాపచయంబుల్
సుకవిజన స్తుతిపాత్రమ ♦
శుకవిజన విహార ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 27

శకటాసుర సంహరణా ♦
సకలామర సేవితాంఘ్రి సరసిజ ♦ కృష్ణా ♦
మకరాంక జనక ♦ మురహర ♦
కుకులాంతక ♦ ధీర ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 28

కాయజునిఁ గన్నతండ్రి ♦
నాయెడలఁ గటాక్షముంచి నన్నుఁ గృతార్థుఁ
జేయుమనంగ "వరంబిడ
గో ♦" యని యనవేల రాజ గోపాల ♦ హరీ ♦ 29

యాదవ కుల శేఖర ♦ నీ
పాదములెద నమ్మియుంటి పంకజనయనా ♦
నీదయను జూచినను జే
కోదగు సురవినుత రాజ గోపాల ♦ హరీ ♦ 30

చిత్తజరిపువందిత ♦ నీ
చిత్తము నాయందు ♦ జూపి శ్రితరక్షక ♦ నా
చిత్తమున నిల్వుమి త్రిలో
కోత్తమ ♦ జనపాల ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 31

అంబుజనాభ ♦ జనార్దన ♦
సంబంధ విబంధరహిత ♦ సారసనేత్రా ♦
సంబరమున నను బ్రోవవె
కుంభినినుత పావన రాజ గోపాల ♦ హరీ ♦ 32

అంభోజ సంభవార్చిత ♦
జంభారి మరుత్సమాజ సన్నుతచరణా ♦
గంభీర ♦ శౌర్య ♦ ధైర్యా ♦
కుంభిపనుత పాద ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 33

ఘనమహా నను విడనాడుట
తనుమానము లేక కృష్ణ ♦ జలరుహనయనా ♦
వినుమా నా మనవిని గై
కొనుమా మురవైరి ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 34

వందనము భక్తవత్సల ♦
మందరధర ♦ గరుడగమన ♦ మాధవ ♦ విష్ణూ ♦
సుందర పతి ♦ గోవింద ♦ ము
కుంద ♦ సురాధార ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 35

పరా యోరిపరాత్పర
రా నానను బ్రోవవేగ రాక్షసహరణా ♦
ధీరా శకటాది మహా
ఘోరాసుర దమన ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 36

గతినీవని నమ్మితి నే
నితరుల వేడంగజనను పేంద్ర ♦ శరధి జా
పతి ఁ నను ఁ బ్రోవగరాదా
కుతుకము వెల్లయంగ రాజ గోపాల ♦ హరీ ♦ 37

సిరులొసఁగుమనుచు నిరతము
పరమదయాసాంద్ర ♦ మిమ్ముఁ బ్రార్థించితినన్
గరుణించి కావవే హరి ♦
కోరఁ తలు తీరంగ రాజ గోపాల ♦ హరీ ♦ 38

హరిహయ సురమునిపూజిత ♦
హరివంశ సుధాబ్ధిసోమ ♦ హరివిభుశయనా ♦

ఖగరాజ ధ్వజ ♦ వినుతే
గురుతుగ జేసితిని ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 39

హరిభజన సేయువారిని
మరువక రక్షించుబిరుదు మరచితివో రా
మరుపేల నీకునాయెడ
గురువని వేడితినిరాజ గోపాల ♦ హరీ ♦ 40

శ్రీవల్లభ ♦ నారాయణ ♦
భూవందిత ♦ చక్రహస్త ♦ పురుషోత్తము ♦ సదా
బ్రోవందగు సమయంబిదె
గోవింద ♦ మురారి ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 41

జలజాక్ష ♦ భక్తవత్సల ♦
జలజాసన జనక ♦ క్షీర జలనిధితల్పా ♦
జలజాప్త తేజ ♦ రాక్షస
కులమర్దన ♦ శౌరి ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 42

కరిమొరఁ జెవివినిసంతన
బిరబిర రక్షించినట్టి బిరుదిప్పుడేదో
హరి ♦ నా మొరవినునాపై
గురిదప్పకు సేయురాజ గోపాల ♦ హరీ ♦ 43

ఇలపై దాసులఁ బ్రోచిన
కాలందికి నన్నుఁబ్రోచితేని కామవేమగునీ
చలముడిగి కరుణఁ జూపవె
కులిశాయుధ వినుత ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 44

నలినాక్ష ♦ కలుష మోచన ♦
నలినోద్భవ వినుతపాద ♦ నన్నుఁ గావుమతో
కలికల్మష భంజన ♦ యదు
కులభూషణ ♦ శౌరి ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 45

ధాత్రిని నరకాసురునను
మాత్రిమునంగ్రమించితంచు మధుసూదన ♦ నీ
స్తోత్రము సేయరేదివిజులు
గోత్రాద్రిను తాంక్షుద్రి ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 46

వసుదేవ నందన ♦ కృపా
రస మొసగవదేల శ్రీధరా వల్లభ ♦ గో
పసతీ మన్మాబ్జభాస్కర ♦
కుసుమాయుధ జనక ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 47

బలభద్రానుజ ♦ కేశవ ♦
లలిత మయూర వరపింఛలాంఛనవాళీ ♦
జలధరదేహ ♦ నిశాచర
కులసంహార ♦ ధీర ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 48

లోకేశ ♦ కృష్ణ ♦ మాధవ ♦
పాకా రికృతప్రణామ ♦ భవహరనామా ♦
శ్రీకాంతా ప్రియవల్లభ ♦
గోకుల సంచార ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 49

సురపతి శుచియమనైఋతి
వరుణసమీర ధనదశివ వనజభవాదుల్
శరణనుచు మిమ్ముఁగొలిచిన
గురుతుగఁ బ్రోచితివి రాజగోపాల ♦ హరీ ♦ 50

అండజరాడ్వాహన ♦ కో
దండము ధరియించి దైత్యదళముల నెల్లన్
చెండితివి దివిజులలరగ
కుండలిరాట్శయన ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 51

కందర్పజనక ♦ సురనర
వందిత ♦ కరిరాజవరద ♦ వైకుంఠపతీ ♦

నందకుమార ♦ మురారి ♦ ము
కుంద ♦ సురాధార ♦ రాజగోపాల ♦ హరీ ♦ 52

సుందరమగు మీపదములు
పొందుగ నామదినినిల్పి పూజించెద నా
యందుఁగటాక్షముఁజూపవె
కుందసమాన రదరాజ ♦ గోపాల ♦ హరీ ♦ 53

నామనవి చిత్తగించి ద
యామతి ననుఁబ్రోవుమీరమాధిప ♦ మేఘ
శ్యామలవర్ణ ♦ పరాత్పర ♦
కోమలరవితేజ ♦ రాజగోపాల ♦ హరీ ♦ 54

రంగా ♦ దీనదయాకర ♦
గంగాధర వైరిజనక ♦ కంసాంతక ♦ శ్రీ
రంగేశ ♦ సోకుమూకల
గొంగ ♦ సురాధార ♦ రాజగోపాల ♦ హరీ ♦ 55

వినతా సుతవాహన ♦ శ్రీ
వనితా హృత్కమలమిత్ర ♦ వనరుహనేత్రా ♦
ఘనతాపస సన్నుత ♦ కై
కొనుమానా మనవిరాజ గోపాల ♦ హరీ ♦ 56

నీరజనాభ ♦ జనార్దన ♦
వారిజభవ ♦ నీలకంఠ వందితచరణా ♦
నేరములెంచక నాపై
కూరిమి దయఁజూడురాజ గోపాల ♦ హరీ ♦ 57

నారాయణ ♦ జగదీశ్వర ♦
మారారినుతాంఘ్రియుగళ ♦ మనుజాశన సం
హార ♦ సురేంద్రస్తుత ♦ నా
కోరికలూన గూర్పురాజ గోపాల ♦ హరీ ♦ 58

శ్రీమన్నారాయణ ♦ హరి ♦
దామోదర ♦ దైత్యగహన దావాగ్నిశిఖా ♦
సామజవరద ♦ కృపానిధి ♦
కోమల ♦ వనమాలి ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 59

పవనాశనరిపువాహా ♦
భవభంజన ♦ తోయజారి భాస్కరనయనా ♦
నవనీతాపహ ♦ శౌరి ♦
కువలయనుత పాద ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 60

బృందావన సంచారా ♦
బృందారక వినుతనామ ♦ బిసరుహనాభా ♦
నందాది గోపకావన ♦
కుందసమాన రద ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 61

కంజాత పత్రలోచన ♦
రంజితముని గానలోల ♦ రవిశశినయనా ♦
అంజలి జేసినుతించెద
కుంజరపరి పాల ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 62

పన్నగ శయనుడ ♦ వినుమా
పన్నుల రక్షింతువనెడి పంతములిప్పుడున్
చెన్నుగ దయనాపై రా
కున్నను గురిఁదప్పు రాజ గోపాల ♦ హరీ ♦ 63

తపములు సేయఁగ నేరను
చపలుండను దుర్మదుండ సరగున నన్నున్
నెపమెన్నక గృపజూడుము
కుపితజన విదూర ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 64

ఒప్పుగల వారిఁబోల్చుట
కెవ్వరును సహజంబుగాదె యేమరకననున్

మెప్పుగ రక్షించిన దే
గొప్పసుమీ నేడురాజ గోపాల ♦ హరీ ♦ 65

వనజాతాయతలోచన ♦
ఘననీల శరీర ♦ ఘోర కలుషవిదూరా ♦
మునిజనపాల ♦ మనవిం గై
కొనిప్రోవవె మమ్మురాజ గోపాల ♦ హరీ ♦ 66

వేదండ వరద ♦ మాధవ ♦
నీదండనుం జేరికొలిచి నీపదములకుం
నేదండము పెట్టితిగద
కోదండకరాబ్జ ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 67

నీచరిత సుధాసారం
బేచవులకు మిన్న శ్రీరమేశ ♦ దయాళూ ♦
నీచరణంబులు చక్షు
ర్గోచరముగం జేయురాజ గోపాల ♦ హరీ ♦ 68

వృక్షచరార్చిత ♦ శతప
త్రాక్షా ♦ కరిరక్ష ♦ కౌస్తుభాంచితవక్షా ♦
పక్షితురంగ ♦ జగంబులు
కుక్షిని నిడికొన్నరాజ గోపాల ♦ హరీ ♦ 69

ధర్మార్థ కామమోక్షము
లర్మిలినా కొసంగుమీ దయామతి నాదు
ష్కర్మములుం బాపి నీదగు
కూర్మిని నను బ్రోవురాజ గోపాల ♦ హరీ ♦ 70

శాంతాది సకలసుగుణ ని
శాంత ♦ దయాసాంద్ర ♦ లోకసంరక్షక ♦ శ్రీ
కాంతాపతి ననుం గావవె
కుంతీసుత పాల ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 71

శ్రీనీళా భూవల్లభ ♦
నేనీపాదాబ్జసేవ నెరనమ్మితిరా
వేనీకరుణను నన్నుఁజే
కోనీ దాసునిగరాజ గోపాల ♦ హరీ ♦ 72

ప్రకటన కెక్కిన సీతా
రకనామమె నామదిని నిరతముజపింతుఁగా
సకలైశ్వర్యము లొసఁగుము
కుకులాంతక ♦ శౌరి ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 73

అజరుద్ర పురందరసుర
గజరాడ్భుజగేంద్ర గరుడ గంధర్వనుతా ♦
భజియించెద నీనామము
కుజనగణ విదూర ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 74

నావలనఁగలుగుదోసము
లేవలనో బోవఁజేసి యేలెదొ దేవా
భూవల్లభ ♦ నినునమ్మితి
గోవల్లభ వినుత ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 75

పామరులఁగూడ మనుచుట
కీమము నీదనుచువినుచు నినువేడితి నా
కామితము లొసఁగి యేలుము
కోమలపద పద్మ ♦ రాజ గోపాల ♦ హరీ♦ 76

నామీదఁగరుణ రాదది
యేమొనావలన నేరమేదో సుగుణో
ద్ధామ ♦ జనార్దన ♦ శౌరీ ♦
కోమలరవి తేజ ♦ రాజ గోపాల హరీ ♦ 77

దాక్షిణ్యాకరమూర్తీ ♦
దాక్షాయణ్యర్చి తాంఘ్రి తామరస ♦ నన్నుఁగా

రక్షించు మెల్లజగములఁ
గుక్షిని నిడుకొన్న రాజ గోపాల ♦ హరీ ♦ 78

ఆదరణ సేయుమని నీ
పాదములఁ బడితినింక పాలించవె దా
మోదర ♦ కరుణానిధి ♦ కా
కోదర రాట్తల్ప ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 79

పాపములు జేసితిని నీ
కోపము రాదికయిపుడు కూరిమినాపైఁ
జూపుట న్యాయము రావే
గోపీవర తనయ ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 80

పాతకము లెల్లఁబాపియు
భూతలమున నన్నెటులఁబోషించెదవో
యేతరియు నిన్నె నమ్మితి
గోతతి పరిపాల ♦ రాజ గోపాల ♦ హరీ ♦ 81

శ్రీనాయక ♦ నీనామము
నా నాలుక పైననిల్పి నతులొనరింతున్
పూనికతో రక్షించుము
గోనాయక వినుత ♦ రాజగోపాల ♦ హరీ ♦ 82

నేరకఁజేసిన దోసము
దూరముగాఁజేయఁదగిన దొరవీవనుచున్
సారెకు నిను మదివేడితి
కోరికలొనగూర్పు రాజగోపాల ♦ హరీ ♦ 83

సాగరమున మీనమవై
దాగిన సోమకుని దునిమి ధాతకు శ్రుతులన్
వేగమె కొమ్మనియియ్యవె
గోగమన సుతాంఘ్రి ♦ రాజగోపాల ♦ హరీ ♦ 84

దేవాసురులునుఁదరువ్వగ
నావారిధి గ్రుంకు మందరాద్రి ధరింపన్
నీవేకమఠమై తివి
గోవాహనుడలర రాజగోపాల ♦ హరీ ♦ 85

మునుధర జాపగఁజుట్టిన
కనకాంబకునిం బొరిగొనఁగ వరాహమవై
తునిమితివౌర సురావళి
కొనియాడఁగఁబ్రీతి రాజగోపాల ♦ హరీ ♦ 86

స్తంభమునం దుద్భవమై
గఁభీరముగోడ హేమకశ్యపునురమున్
జృంభించి చీల్చినై చితి
కుంభిని నుతియింప రాజగోపాల ♦ హరీ ♦ 87

వృషమిని మూడడుగులు బలి
నిమమని కైకొనిన సిరుల నిందుగ్రినకుఁదగన్
వడినొసఁగవె యదితికి నిం
గొడుకని నుతికెక్కి రాజగోపాల ♦ హరీ ♦ 88

ఇరువది యొకమార్లుగ భూ
వరులను మర్దించి విప్రవరులకు నెమ్మిన్
వరమొసఁగవె భార్గవ ♦ నిను
సురిగావేడితిని రాజగోపాల ♦ హరీ ♦ 89

రాతిని నాతిగఁజేసి ధ ♦
రాతనుజాత స్వరించి రాఘవరామా ♦
ఖ్యాతిగ రావణుఁదునుమవె
క్షోణితులు నినుఁగొల్వ రాజగోపాల ♦ హరీ ♦ 90

హాలచక్రధరులరై భూ
వలయమునన్ రిపులనెల్ల వధియించిన శ్రీ

బల కృష్ణమూర్తులగు మిము
గొలిచెద నతిభక్తి రాజగోపాల ♦ హరీ ♦ 91

శంక యయిన నరకాసురు
గంతముఁ దునుమాడి రాజకన్యల వెస శ్రీ
కంఠ నుత ♦ కైకొనవె నై
కుంఠ పురీ నిలయ ♦ రాజగోపాల ♦ హరీ ♦ 92

దనుజేంద్ర సతులనౌ కమింప
ననయము వ్రతమొకటి సల్పుఁడని వ్రతభంగం
బొనరించి దనుజులనుఁ బే
ర్కొని నుసుమ వెబుద్ధఁ రాజగోపాల ♦ హరీ ♦ 93

కలికావతారివై యిఁకఁ
గలుషాత్ములఁ జంపి బుధులఁ గాపాడుటకై
వెలసెదు జగదీశ్వర ♦ నినుఁ
గొలిచెద ననుఁ బ్రోవు రాజగోపాల ♦ హరీ ♦ 94

దశరూపములు ధరించి య
వశులగు దుష్టులనుఁ జంపి వసుధాస్థలిపై
యశమొసఁగ సురల సుజనులఁ
గుశలతఁ బ్రోచితివి రాజగోపాల ♦ హరీ ♦ 95

కస్తూరీ తిలకాంచిత ♦
కౌస్తుభమణి లలితవక్ష ♦ కరుణాకర ♦ లో
కస్తుత్య ♦ కావగదవే
గో స్తన మృదుభాష ♦ రాజగోపాల ♦ హరీ ♦ 96

శ్రీరుక్మిణీ మనోహర ♦
భూరిదయాసాంద్ర ♦ విబుధపూజితచరణా ♦
మారశతకోటి సుందర ♦
గోరాజ సుతాంఘ్రి ♦ రాజగోపాల ♦ హరీ ♦ 97

నిండగు కౌరవ సభలో
పాండవసతి మానభంగ పడకుండ దయన్
మెండుగ వలువ లొసంగితి
కుండలిరాట్తల్ప ♦ రాజగోపాల ♦ హరీ ♦ 98

నందయశోదాపవిత్రా
నందన ♦ సనకాదిమునిజనావన ♦ సత్యా
నందకర దివ్యరూప ♦ ము
కుంద ♦ దయాసాంద్ర ♦ రాజగోపాల ♦ హరీ ♦ 99

గోపీగోప జనావన ♦
గోపాలకతనయ ♦ శౌరి ♦ గోవింద ♦ మహేం
ద్రోపల వినీలదేహా ♦
గోపార్భకమిత్ర ♦ రాజగోపాల ♦ హరీ ♦ 100

శ్రీమద్గోపవధూటీ
స్తోమాధర మధురస ప్రచుంబనలీలా
కామ ♦ శుభనామ భూధర ♦
కోమలరవితేజ ♦ రాజగోపాల ♦ హరీ ♦ 101

మానశరాహతి కోర్వక
నీనామముఁబాడుగోప నీరజముఖులన్
మానుగ నేలితి బ్రీతిన్
గోనాయకవినుత ♦ రాజగోపాల ♦ హరీ ♦ 102

బృందావనచర ♦ గోకుల
బృందావనకల్ప ♦ వైరిభీకర ♦ సుయశో
బృందా ♦ వనజాతాంబక ♦
కుందయశస్సాంద్ర ♦ రాజగోపాల ♦ హరీ ♦ 103

దేవేశ ♦ దేవకీవసు
దేవుల కాత్మజుడవై ♦ పృథివి దుష్కర్ములా

భూవరుల జంపవే గోలి
గోవర్ధనధార ♦ రాజగోపాల ♦ హరీ ♦ 104

చిరుతనమున నినుఁ గంసుఁడు
బొరిఁ గొసఁదన భటులనఁపఁ బొలియింపవె చా
ణురముష్టిక ప్రలంబుల
గురుసత్త్వులనెల్ల రాజగోపాల ♦ హరీ ♦ 105

నినుఁ ద్రోద్రేకఁగ నక్రూ
రునిఁ బంచిన మధురకేగి క్రూరుద్ధండగు కం
సునిజంపి బుధులఁ గాచినఁ
గొనియాడరె జనులు రాజగోపాల ♦ హరీ ♦ 106

కందంబుల శతకమునా
నందమునఁ గూర్చిమీకు నర్పించితి గో
విందదయన్ గైకొనుము ము
కుంద ♦ సురాధార ♦ రాజగోపాల ♦ హరీ ♦ 107

ధరనూజవీట్పురస్థిత
వరనిస్తుల రాజనగరవాస ♦ జయశ్రీ
కర ♦ విబుధ సుజనపోషణ ♦
గురుమందరధీర ♦ రాజగోపాల ♦ హరీ ♦ 108

రవిభ ♦ సుపర్ణస గోత్రుడ
నవనిన్ కుందనపు శేషయాఖ్యుడ భక్తిన్
కవిత యొనర్చితి నీదయఁ
దు వలయనుతపాద ♦ రాజగోపాల ♦ హరీ ♦ 109

మంగళం మహాత్.

